# ABHAYA MUDRA
## (LYRICS)

by
PANYALA RANGANATHARAO

First Edition July – 1960
Price Re. 1-00





Publishers : ADDEPALLY & CO.
SARASWATHI POWER PRESS:
RAJAHMUNDRY (A. P.)

మా

ము ద్దు ల శే ఖ ర్

కి

# : కృ త జ్ఞ త :

ఇందులోని వన్నీ ఇదివరకు వివిధ పత్రికలలో ప్రచురించ బడ్డాయి. ఇప్పుడు వీటిని ఒక పుస్తకరూపంలో తీసుకు రావ డానికి అన్ని విధాలా తోడ్పడటమే కాకుండా, కోరిన వెంటనే అమితోత్సాహంతో పరిచయ వాక్యాలు రాసి పరిపూర్ణత్వ మిచ్చారు – ఆప్త మిత్రులూ, రసజ్ఞులూ, సహృదయులూ శ్రీ పురిపండా అప్పలస్వామి. ఈపుస్తకాన్ని ప్రచురించేభారం తమ మీద వేసుకొని ఇంత చక్కగా దీని కొక రూపమిచ్చారు శ్రీ అద్దేపల్లి నాగేశ్వరరావు గారు. అందరికీ నాకృతజ్ఞత.

ప న్యా ల

# ప రి చ య ం

అతిథులం.
అతిథులం
నవగ్రహోత్త జనితులం
నరవరుల కతీతులం
ప్రతీతులం సమేతులం
నిరాశలేని వారలం
అనంత శూన్య పథికులం
బాధితులకు దూతలం
ప్రవాసులం
పీడిత జనమిత్రులం.
అవును నిజం, నేస్తాలా! మనమంతా అతిథులం; ప్రవాసులం.
తూరుపు తెలుగు రవలే మనగుండెలలో చలిమంటలు.
నిశ్శబ్ద శబ్ద బీభత్సంలో మనకు వినపడుతుంది అడుగుల చప్పుడు.

నిజమే నేస్తం, మేఘాలన్నీ వర్షిస్తున్నవి. చెరువులూ, బావులూ నిండిపోతున్నవి. కాని గుక్కెడు నీళ్ళకు మన ప్రాణం మాత్రం కొట్టుకుపోతున్నది. నాలుక లాక్కుపోతున్నది. గుదిబండగా మారింది బతుకు. నిజమే, మన బతుకు! మర్మం, ధర్మం, న్యాయం, సత్యం ఎక్కడుందని వెదుకుతావు? ఏదీ?

ఇది కీకారణ్యం. నవయుగారణ్యం.
తలల్లేని శరీరాలు కనబడి
అలల్లేని కెరటాల ఘోష వినపడి
అర్ధరాత్రి నడినెత్తిన సూర్యం
పట్టపగలు చిట్టచీకటి శూన్యం
పొడగట్టిన చెరపట్టిన స్వప్నంలో
మన తలలు వేరయి మనతో
మాటాడిన మాటలలో

మనకొక ఆశాకిరణం
మన లవలేశా భరణం
అదే కవిత్వం నీ అభయముద్ర.

*　　　　*　　　　*

కవిత్వం ఉల్లాకువేసి ఖరీదు కట్టడం కష్టం. రశికహృదయ ఫలకమే దానికి గీటురాయి. రశికుడి చేతిలో కవిత్వం రాణిస్తుంది. అరశికుడి చేతిలో అదే అసహ్యమవుతుంది. కోడిముందు కెంపు కందిగింజకంటే కనికష్టం.

అభయముద్ర కవిత్వం.

అభయముద్ర కవి శ్రీ పన్యాల రంగనాధరావుగారు తెలుగు గడ్డమీద సుపరిచితుడైన సాహిత్య హాలికుడు. ఢిల్లీ ఆకాశవాణినించి ఈయన కిశోరకంఠం తెలుగు కొంపల్లో ప్రతిధ్వనిస్తూనే వుంటుంది.

పన్యాల కవి; కథకుడు; నాటక రచయిత; సహృదయుడు; స్నేహశీలి. ఆయన మధురకవితకి అభయముద్ర చిన్న మచ్చుతునక. ఈయన కవితా స్రవంతి నిర్మలమైన సెలయేరు. ఈ నీట ఎవ్వరినీడలూ లేవు. ముఖ్యంగా ఇదే దీని ప్రత్యేకత. పన్యాల తన మార్గం తాను ఏర్పరచుకున్న నవకవి. ఈ మార్గమే ఈయనకి వొక ప్రత్యేకస్థాన మీనాటి కవికుమారుల్లో కుదిర్చి పెడుతున్నది.

రాజమంద్రి
24 – 6 – 60

పురిపండా అప్పలస్వామి

# * శీర్షికలు *

# పంచశీల

ఒకనాటి రాత్రి కుత్తుకలోన ఒక చిన్న
పలుకు కేకయి, తేనెలొలికి, మొట్ట
మొదటి మాటయి, నోరు కదిపినవేళ, క
న్నులు విడ, ఏనాటి నోము పంటొ,
చూచితి నీ దివ్య సుందర మంగళ
మంద మందస్మిత మధురమూర్తి,
నావైపు చిరునవ్వు నవ్వ, నీ అరచేతి
నెత్తి దీవించి నన్నెత్తుకొని, యొ
కింత దేహమ్ము నిమిరి నీ శాంతరసము
నుగ్గుపాలుగ బట్టి, నన్నొదిలిపెట్టి
సెలవడిగి పోయినావు వచ్చెదననుచు
నీవు — జ్ఞాపకమున్నదా, స్నేహశీలి ?

నేడు నేనొక్క మనీషుడనై కోటి
గొంతుల నా గొంతు కొంతచేర్చి,
పాటలు మాటలు పాడి ఆడుకొనంగ,
ప్రవహించె నదులు క్షీరములు నిండి,

గిరులు ద్రవించె, సాగరము సంగీతమ్ము
పొంగించె, విశ్వ ముప్పొంగి నాట్య
మాడుకొన్నది, హర్ష మాకళించినది, జ
నాళి కాహళి పల్కె నవ్య గీతి.

ఒక్కొకటి గుండెలో రాగ ముద్భవించి
అల్లుకొన్నది అనురాగ వల్లికలు, స
మస్త భావమ్ము లేకమై ప్రస్తుతించు
కొన్న వొక శాంతమూర్తి చేకొన్న గాథ.

ఆకలి కేకలన్ విని, ద
యార్ద్రతతో, భువిలో దరిద్ర మం
తాకని, కంట నీ రొలికి
తాపక డెందము క్రుంగిపోవ, ఈ
లోకమునందు సత్య మవ
లోకన చేయగ పట్టినట్టి దీ
క్షాకృతి కీ సుమమ్ము లుప
హార మనోహరహార మయ్యెడున్.

స్వార్థ మొకటి పాము పగవోలె బుసకొట్టి
కాటువేసి భువిని గాయపరిచె.
ధ్యానముద్రనుండి ద్రవియించి కారుణ్య
రసము లమృతములయి ప్రాణమిచ్చె.

ఈ నా డెంతటి భాగ్యసీమ యిది, ని
న్నే భావమందుంచి, లో
కాసన్ శంఖము పూర్చి నూదినది దీ
క్షా వాణిశ్రీయై, పంచ శీ
లానవ్య ప్రతిభల్ చిగుర్చుకొని, క
ళ్యాణ ప్రదమ్మయ్యె, నీ
లోనన్ శాంతరసమ్ము కోరినది క
ల్లోలమ్ములన్ మాన్పగన్.

ఇది మానవ శపథ, మ్మిది
ఉదయించిన స్నేహరాగ మొకయెద ప్రేమా
స్పదమగు స్పందన మిది, సం
పద యిదె, శాంతి కొక దివ్యపథ మిదె జగతిన్.

# లాస్యం

ఉదయించిం దొక ఉజ్వల తారక
కదలిం దొక చిరకాలపు వేదిక
పగులు కొనిం దొక రాగ జ్యోతిక
విసరించిం దొక చిరతర కోరిక

కరుణించిం దొక కాలములో తృటి
ప్రభవించిం దొక పల్లవి నాహ్లాది
అలయించిం దొక హాస సముద్రిక
ఎలయించిం దొక తొలకరి మాలిక.

కరిగిం దొక శిల గానసుధాశ్రిత
మెరసిం దొకపరి మింటి తటిల్లత
హరియించింది జనావళిలో క్షుద
వరియించింది ప్రభావిత సంపద.

# లాల్ ఖిల్లా

ఇది పజపజ వణికించెడి
మిడిసరి లగ్నం
మది భుగభుగ మండించెడి
కదసరి యజ్ఞం

కృతయుగ సాంఖ్యమ్మున
ఖడ్గబల ప్రావీణ్యం
రుధిరజ్వాలా మయమయి
మండి మండి ఎండి యెండి
యుగయుగాల గాథావళి
కబళించిన లాల్‌ఖిల్ల
కిది భుగభుగ మండించెడి
కదసరి యజ్ఞం
మది పజపజ వణికించెడి
మిడిసరి లగ్నం

అంతెరుగని వర్తమాన
భూత భవిష్యత్కాల
స్మృతిసీమల జాతి వర్ణ
మత భావాలకు లొంగని

మయూరపీఠం, పాలిత
ప్రజాప్రాతినిధ్య మంట
పమ్ము, పాలరాతిపత్ర
శిల్పాల ప్రతిబింబం -
రాణుల క్రీడా మందిర
రహస్యాల జాడల మే
డల గోడల వాడల మూ
టీస చిత్రవిచిత్ర చిత్ర
వికృతాలకు నవ నగిషీ -
లందిచ్చే తిలాంజలుల
కిది పజపజ పణోకించెడి
మొదసరి లగ్నం
మది భుగభుగ మండించెడి
కడసరి యజ్ఞం

యుగ సంధ్యాస్ఫురణ బలో
ద్రిక్త మొగల్ దైనందిన
రణ బీభత్సాల విజయ
పతాకాల ప్రాకారం
దేశాంతర దేశీయ వి
దేశ బాహుబలాంధత్వ
మణగార్చిన అణగారిన
స్వాతంత్ర్య ప్రజావేశ

ముంతులేని గుండెబాధ
కిది భుగభుగ జ్వలియించెడి
కడసరి యజ్ఞం
ముది వజవజ వణికించెడి
మిడసరి లగ్నం.

సంధ్యారుణ కాంతుల సం
స్పందన జ్వాలా తోరణ
మహాంతమా మీ బ్రహ్మాండ చ
రిత్ర క్షుదార్తికి హారం
వ్యథలోని సమాధుల రూ
పాలు దిద్దు లాల్ ఖిల్ల
కథలో పరమావధిలో
బధిరజాతి వధల ఖిల్ల
కిది వజవజ వణికించెడి
మిడసరి లగ్నం
ముది భుగభుగ మండించెడి
కడసరి యజ్ఞం

# శి థి ల గా థ

చలి చలి చలి గుండెలోన
జగత్తు కంపించెడి చలి
అబ్బబ్బా ! ముందు వెనుక
అడుగులు పడనియ్యని చలి
మృత్యువును జయించిన మే
మీ లోకారాధ్యుల మం
టూ విజేత సైన్యంలా
మిణుకు మనే దీపాలవి.

అబ్బా ! నీకంత చలా !
అనుభవమే అర్థ మువును
చలిలో చలిబాధ కేక
'ఎవరక్కడ ?' ఒకే కేక.

బెదరిన ఆదరుల్లో ఒక
క్షణకాలం గగుర్పాటు
' ఎవరది నన్నెరుగువారు ? '
అంతరాత్మ తిరుగుప్రశ్న.

" నవ నాగరికత నేర్పిన
దా, చలి ! ఇది వెచ్చని చలి !
అరగంటకు ముందు రోజా
మడుగున ప్రేయసి కౌగిలి
వెచ్చదనం రుచులు మరిగి
విడువలేక బయటపడ్డ
నాగరిక మానవుడా !
అబ్బా ! నీకంత చలేం ! "

' నా పూర్వీకుల కృత్యా
లకు ఫలితం దౌర్బల్యం
అది నా జన్మ విశేషం —
నాతో మీకేమి పనో ! '

కత్తికోతవంటి గాలి
కత్తెరలో చెట్టుకి చలి
ఆకలితో చీకటిలో
అంతలోన నక్క అరుపు.

' స్మృతిపథాలు దాటిన వా
టికి విలువలు లేవు గాక
అబ్బబ్బా ! చలి అన్నది
శిథిలగాథ కొక్క పిడుగు
పడకట్టిన రక్తమ్ముడు
కెత్తించే తిరుగుబాటు —

మా పౌరుషములకు ఫలిత
మిపుడు సమాధులై మిగిలెను
జ్వలితమైన అమర ప్రే
ముల చిహ్నములే రగిలెను.
మా కోరిక లీ చలిలో
కొరడుగట్టి, వాటికేమి —
యుగయుగాలు గడచిపోవు
గాక, మాకు నిద్రరాదు
కష్టించిన మానవుడే
ఫలసంపద కర్హుడు అం
దాక మాకు శాశ్వతమగు
శాంతి రాదు, శాంతి లేదు.

కోటలలో పాతకొత్త
కలయికలకు పేర్లు వేరు
స్మృత్యంకాలందు కుతుబ్,
జుమ్మా, తాజ్ మొఘల్ సమాధు
లందు వీర విహారములు
ప్రణయ నృత్య గానమ్ములు
ప్రాపంచిక వింత పదా
ర్థాలైనవి — అవునుగాక

శోకావేశాలకు ప్ర
త్యేకప్పుగా ప్రతిధ్వనించు —
అబ్బాబ్బా ! చలి అన్నది
దాస్యమునకు లొంగుబాటు.
విన్నావా మానవుడా !
ఇది మాదొక శిథిలగాథ ! '
తూరుపులో వెలుగు రవతె
గుండెలలో చలిమంటలు !

# చైత్ర యాత్ర

అవనీగర్భంలో అణువణువున ఉత్తేజం
జనసామాన్య చైతన్యాన్ని సంస్మరించింది
బరువైన పాదాలక్రింద అరిచే శవాల
తిరుగుబాటు ప్రోత్సహిస్తుంది మౌనంగా.

పచ్చని పైరులపై ప్రవహించిన రుధిరం
కాలసర్పంలాగ తాండవించింది
అతిథి సత్కారానికి మార్గంవేసి
నవయుగ చైతన్యానికి హారతి పాడింది.

ఏనాడో ఎక్కడో జన్మించిన పసిపాప
కాలానికి పాఠాలు నేర్పింది.
శబ్దాన్ని విస్మరించింది మత్తెక్కింది
ఢమరుక నాదంలో మరుఘుడియ.

ఖడ్గంలో అల్లాను పలికించిన ఖడ్గం
వైషమ్యంలో స్నేహాన్ని చూసిన వైషమ్యం
ప్రాగ్దిశాగమన పాంథుని జోలపాటలో
మై మరచింది నిద్రించింది.

హోరని ప్రవహించే వైతరిణో
మార్గం తొలగి చీలిపోయింది
ఆకాశాన్నుంచి రాలిన పూవులు
నవ్వుకున్నాయి భరతం నర్తించాయి.

అప్పుడే దూడనుచూసిన గోమాత
పాలతో పాదాలు అభిషేకించింది
సముద్రగర్భంలోని జ్ఞానగీతి
అవతరించింది ఆనందంతో.

ఏకోదరుల రక్తస్పర్శకు
సిద్ధిస్తుంది మానవత్వం
వ్యాకులిత హృదంతరాళంలో
నవరాగమాలిక లల్లుకుంటాయి.

అబ్దాలు దాటుకొస్తున్న సంస్కారం
అడుగు వెనక్కువేసిందొక క్షణం
యుగాంతర స్వరూపాన్ని చూసి
పదేళ్ళు ముందుకి పరుగెత్తాయి.

అన్నా ! చేయీ చేయీ కలిపి
చెట్టాలు వేసుకుందాం
సేతువుకీ హిమాచలానికీ కలిపి
పెళ్ళిచేద్దాం వైభవంగా

ఎవరు మీరన్న కాలాన్ని
వెనక్కి పంపించేద్దాం
ఎక్కడలేవు మనకు
పరిమళాలు ?
ఇక్కడలేవు మనకు
సంతాపాలు !

[ గాంధీజీ నవఖాళీ పదయాత్ర సాగించిన వేళ. ]

# అ డు గు ల  చ ప్పు డు

నిశ్శబ్ద శబ్ద బీభత్సంలో
నిద్రలోని పసిపాప కేకలో
వెలుగును వెతికే నీడనడకలో
వినపడు తున్నది
అడుగుల చప్పుడు.

చీకటి ముసుగుల
కాలవాహినీ
గమనంలో దడదడమను గుండెలు
కలలు కన్నదొక
గమ్యం కోసం
వలచుకొన్న దొక
దరిద్ర వేషం.

ఎక్కడికైనా సరే ప్రయాణం
ఒక్కనాటికే చేరదు ప్రాణం
అనంత విశ్వంలోగల సత్యం
హరించుకొని పో
దది అనునిత్యం

సమాధులన్నీ లేచిపోయినై
సమరంకోసం వాచిపోయినై
చావులేదు నవచైతన్యానికి
లేవబోదు మా
రణ హోమానికి.

పుట్టుకలోనే గుర్తించిందొక
పుట్టెడు బాధ్యత పునరుజ్జీవనం
అడుగుతీసి ముందుకు వేసిం దొక
అనంత సత్యం
అడుగు మహాత్యం.

## మ ం చి మా ట

నాలో రక్తం పిండీ
నా శక్తుల నుడిగించీ
నా పౌరుషమును పీల్చి
నను జీవచ్ఛవ మొనరిం
చిన నీ వెవరైతేనేం
నా జోలికి రాకు రాకు
నా జోలికి మరిరాకు.

నా కోరికలను చంపీ
నా మనసును విరిచేసీ
నా గుండెల నెండించీ
నను పిప్పిగ నమిలేసిన
నీ వింకెవరైతేనేం
నా జోలిక నీ కెందుకు
నా జోలికి రాకు మరి.

నా ఎముకల లోలోపల
నవజీవం చావలేదు
నా నవజీవనంలో పగ

ని పై పడు ఘడియ వచ్చు
నీ వెవరైతే నాకేం ?
నీ కెందుకు నా జోలిక
రాకెప్పుడు నా జోలికి.

నను ముక్కలు చేయగలవు
నా కసి మాత్రము చావదు
నీ రోజుకి భరతవాక్కు
నా రోజుకి నాంది పాట
నీ వెవరైతే మాత్రం ?
నా జోలికి మరి రా కిక
నీ కెందుకు నా జోలిక.

# పరిచయం

అతిథులం
అతిథులం
నవగ్రహాత్మ జనితులం
నరవరుల కతీతులం
ప్రతీతులం సమేతులం
నిరాశలేని వారలం
అనంతశూన్య పథికులం
నవగ్రహాత్మ జనితులం
అతిథులం
అతిథులం

అజంత ధన్యచరితులం
హలంత సౌమ్యభరితులం
కోపతాప
కామరూప
రహితులం
చిదాత్మలం

నాముకాల కహితులం
సహితుల సన్నిహితులం
నవగ్రహోత్ప జనితులం
అతిథులం
అతిథులం
అనంతశూన్య
పథితులం

అండజ బ్రహ్మాండ ఖాండ
చండ చండికా ప్రచండ
శాసనోల్లంఘులం
బాధితులకు దూతలం
దాతలం, భ్రాతలం
విధాతలం, ప్రభాతలం
ప్రమాసులం ప్రమేయులం
ప్రత్యక్ష విచక్షులం
నవగ్రహాల పుత్రులం
అతిథులం
అతిథులం

యంత్రతంత్ర
మంత్రాంగపు
తంత్రుల వి
భ్రాంతులం

పీడిత జనమిత్రులం
పీతలకడ శత్రులం
త్రిలోకశాంతి కాములం
త్రికాలకాంతి ధాములం
అజయులం
విజయులం
అతిథులం
అతిథులం
నవగ్రహోత్త జనితులం
అణుగర్భిత పథికులం

అణగారని ప్రగతులం
నవగ్రహాల గేహులం
నవీనగమ్య కాములం
ప్రపంచ పంచప్రాణులం
విపంచికా నినాదులం
విహారులం, విదాహులం
ఉదారులం, నిదానులం
దుర్జన సంహారులం
గర్జన పర్జన్యులం
ప్రాణుల పరిరక్షణా
ప్రతిజ్ఞలో ప్రతిజ్ఞులం
హింసాసుర శత్రులం

క్షతగాత్రుల మిత్రులం
నవగ్రహాల దూతలం
అనంతశాంతి ధాతలం
అతిథులం
అతిథులం

# మ హో ద యా !

మహోదయా మహోదయా !
మానవోదయాభ్యుదయా !
నవాలోక మానవ
చంచల మానస డోలాయిత
ప్రాతఃగేయా లాపన
కరుణాంచిత మహోదయా !
మానవోదయాభ్యుదయా !

పరమాణుః పరిమాణ
ప్రళయ భీకర భయంకర
నర్తన ప్రాపంచిక స
ద్వర్తన సంఘోదయా !
మానవోదయాభ్యుదయా !

పంచభూత పరివేష్టిత
సంచార పృథ్వీజల
వాయు సంకలిత తాండవ
బలోదయా ! మహోదయా !
మానవోదయాభ్యుదయా !

సర్వ స్వాతంత్ర్య విజయ
గర్వజన హృదయ జనిత
ఏల నాద్భుత మహోదయా !
మానవోదయాభ్యుదయా !

# ఒక కేక

అవును – నా కేక దూరపువాక
అర్థాలు లేక
అనంత దురంతాల పరిధిలో రాక.

అవును – నా సూక్తి సమస్తాలశక్తి
ఆనంద రక్తి
అశేష విశేష జనాళికేముక్తి

అవును – నా పాట మౌనాలవేట
అందించు బాట
అజేయ విజేయ నిజాలకుకోట

అవును – నాశాంతి విశ్వాస క్రాంతి
ఆరాధ్య కాంతి
అమర్త్య సుమాల కవిత్వ స్రవంతి.

# శి లా శా స న ం

కూటికి ఒకపట్టెడు తిండి
దేహానికి కట్టెడు వస్త్రం
క్షుదా ప్రపంచానికి శిలాక్షరాలను .
ప్రజాస్వామివాక్కు శిల్పిస్తుంది.

ఆకులు రాల్చిన నిన్నటి వృక్షం
రేపు పువ్వుల్ని నవ్విస్తుంది
మృగతృష్ణ వైపు పరుగెత్తే లేడిపిల్ల
ఆకాశంలో మబ్బుల్ని పలకరిస్తుంది.

హోమంలో సుడిగుండం లాగు
క్షామం కన్నులు తిప్పింది
లోకంలో సంక్షోభాన్ని
రద్దుచేస్తుంది శిలాశాసనం

జన విశ్వాస చైతన్యంలో
జన్మించిన స్వార్థత్యాగి
క్షుదల వ్యధల వైషమ్యాలకి
గుండెలమీద నిలిచిన కుంపటి

ఒకనాడు జండావిసిరిన పిడని
మరచి పొమ్మంటుంది శిలాక్షరం
ఉషోగీతికా భూపాలం
ఆనందించమంటుంది శాసనం.

నవభారత బాంధవ్యంలో
వైషమ్య విషం కక్కిన సర్పం
శాసనం చెక్కే శిల్పిని చూసి
భయపడుతుంది పారిపోతుంది.

భూదేవిమీద పచ్చపచ్చగా
ప్రతిబింబిస్తుంది శిలాశాసనం
మృత్యువు ఎల్లుండికి తిరిగొస్తే
పరమాణువు నిలుస్తుంది ఎదురుగా.

పాలకోసం పసిపాపలా యేడ్చే
ప్రపంచాన్ని లాలిస్తుంది
అభినవశిల్పి చేతుల్లో పెట్టి
తృప్తిపడుతుంది ఆనందం.

# క్ష మా ప ణ

నువు కడుపారా కన్నపిల్లలం
కోటాను కోట్లం పుట్టుకొచ్చాం
నువు ప్రేమతో పెంచినంతకాలం
నువుపెట్టిన పరమాన్న మంతా తిన్నాం
ఈనాడు మేం పెద్దలం
స్వతంత్రులం స్వేచ్ఛా విహంగాలం.

నీ ఆశలూ, కోరికలూ
నీ వాంఛలూ, భావాలూ
పట్టించుకుంటే మాకున్న
వ్యక్తిత్వమంతా సున్నచుడుతుందని
విర్రవీగాం, వాగాం సాగాం
నిన్ను నోరారా పిలవలేని
పతితులం
తిరిగిపోయి చితులెక్కిన
బుర్రలం
చేశాం ముక్కోటి పాపాలు
వేశాం శతకోటి వేషాలు

రాశాం రాక్షసశాసనా లెన్నో
జీవిత మూలావసరాలు
మూటగట్టి పారేశాం
అన్నంకోసం దేవులాడే వాళ్ళను
అన్నివిధాలా హతమార్చేశాం
పచ్చపచ్చని పైరులన్నీ
పెల్లగించాం మంటవేశాం
మట్టినే పండించాం
మందుగుండు పుట్టించాం
ని సంతానంలో మేమంతా
కాట్లకుక్కలల్లే
రక్కేసుకున్నాం
వెయ్యితలలు ఛేదించిన ఒక్కడు
వెయ్యంతస్థుల మేడ గడితే
బలే మెచ్చుకున్నాం
వెయ్యిడొక్కలు పరిమార్చిన తిండిని
ఒక్కడు తింటూంటే
చూస్తూ ఊరుకున్నాం
ఊరుకోక కీర్తించాం
కీర్తితోపాటు ఇంత
నాయకత్వం కూడా సాయంపట్టాం
తిండినీ గుడ్డనీ

కరువుకి దానం వేసిన
మేమే —
మా ఘనత
వేనోళ్ళ చాటుకున్నాం
మమ్మల్ని కన్నప్పుడే
మాకు నువ్విచ్చిన
దయాదాక్షిణ్యాలు
కారుణ్యం మానవత్వం
మా బుద్ధి వికాసంతో పాటు
త్యజించుకున్నాం
నువు బోధించిన సంస్కారంలో
ఒకరి కొకరం అర్థం కాగలమనే
అనుమానం కలిగి తిరస్కరించాం
మాలో మేమే ఒక కొత్తసంస్కారం
సృష్టించాం తీర్చిదిద్దాం
అలవాటు చేసుకున్నాం
జీర్ణించుకున్నాం — బాగా
ఒకరి కొకరం ఒక ప్రశ్నార్థకమే
మా సంస్కారం గొప్పగుణం
ఒక మాటకు పది వ్యాఖ్యానాలు
మా సంస్కృతి ప్రత్యేకత
చేతనైనవి విడిచిపెట్టాం

చేతకానివే చేస్తామన్నాం
చేతకానివంటూ లోకంలో మరి
లేనే లేవని ఋజువుచేశాం
పిడికెడు బియ్యం
పండించు కోవటం
చేతకాదని ఎదిరించేవాళ్ళను
నరికేశాం, చంపేశాం,
డొక్కచీల్చేశాం, పాతేశాం
అదే మాబుద్ధికీ సంస్కారానికీ
అలవడ్డ మహాలక్షణం
నీకు నిలువునా వస్త్రాపహరణం కానిచ్చాం
నువ్వు నిలవడ్డ చోటల్లా
కార్చిచ్చు పెట్టి నిన్ను
పరుగెత్తించాం మేమే
నీ నోట్లో మట్టికొట్టి నీపై
రాక్షసకృత్యం చేశాం మేమే.
వేనకు వేలు దేవుళ్ళు
సృష్టించాం మొలకెత్తించాం
తలకొక మతం
చెరొక కులం
తథ్యం చేసుకున్నాం
రొట్టిమీద నెయ్యితో ఒకరం

నెయ్యిమీద రొట్టితో ఒకరం
మా ప్రత్యేకత చాటడానికి
ఎన్నెన్నో పనులన్నీ చేశాం
మేం చేసే తప్పులు దిద్దటంకోసం
మాలో లోపాలు సవరించటంకోసం
ఎవరూ లేకుండా చేసుకున్నాం
ఎవరమూ కాకుండా చూసుకున్నాం
ఏ ఆశలతో కన్నావో మమ్మల్ని
నిన్నిట్లా ఉద్ధరించాం
నిన్నింత సుఖపెట్టాం.
నిన్ను నోటినిండా పిలుచుకునే
తాహతైనా లేకుండా చేసుకున్నాం
మమ్మల్ని క్షమించడం తప్ప
నువు చేయగలిగిం దేదీ లేదని తెలిసే
క్షమా భిక్ష వేడుకుంటున్నాం
క్షమించావా,
మేమింకా విర్రవీగిపోతాం
మాకింక పట్టపగ్గాలే ఉండవు
విర్రవీగాలని, సిగ్గువిడిచి
క్షమించ మంటున్నాం మళ్ళీ-
కానీ –
క్షమించకు !
క్షమించకు !

# కొత్త పెళ్ళి

రండర్రా రండి, అంతా రండి !
ఎండిన మొక్కలు చిగురిస్తున్నాయి చూడండి !
పండుటాకు లెప్పుడో రాలిపోయాయి లెండి
బొక్కినమ్మకు దక్కిన బియ్యంలా
ఎక్కడి కక్కడికే, ఇక్కడి దిక్కడికే !
చేసుకున్నమ్మకు చేసుకున్నంతే మరి.
అపరాహ్ణంలో మళ్ళీ
ముహూర్తం మించిపోతుంది
ఎంతో కొంత దీవించండి – మీకు
చేతనైనంతే చాలును లెండి
అందాలపోటీలో గెలుపుకి
అర్థనగ్న యోగ్యతా పత్రం పొందింది
ఈ పెళ్ళికూతు రిప్పటి కింతే
ఎప్పు డెలాఉంటే ఏవరిక్కావాలి ?
చీరా రవికా తొలగించారు
సింగారించారు ఈతవలువ
ముక్కందం చెడుతుందని
ముక్కుపుడక కత్తిరించి

ప్రధానప్పుంగరం కాదది
సంధాన ప్పుంగరంతో పొడిగారు
సన్నాయి మేళం వద్దు
ఉన్న రేడియో తిప్పుకుంటే చాల్సు.
మంత్రాల తంతేదీ కాదు – నాలుగు
ప్రేమ గీతాలు దంచవే పిల్లా !
ఈమధ్య సినిమాల నేపథ్యాలే కొల్ల.
పెళ్ళికొడుకు గుడారంలో
పెరిగింది పెద్ద రభస
పెద్దలు కచ్చులు బిగించి
పెడుతున్నారు పోటీలు
ఈడుతో నిమిత్తం లేదని
ఇల్లెగర గొడుతున్నారు
కాయకల్పం గాళ్ళమని
గగ్గోలు పెడుతున్నారు
ఎవడో వస్తాడు ముందుకి
రాకేంచేస్తాడు చివరికి ?
ఎగరేసుకు పోతా దాయింతా
నోరు తెరిచి చూస్తా రంతా !
ఎటొచ్చీ పోటీదార్లు
పటపట లాడిస్తారు పళ్ళు
అవకాశాలకేం కొదవ ? ఎప్పుడో

అటునుంచి లేవదీసుకు పోతా డప్పుడే
అక్కడే కాసిన ప్రథమ హంతాకుడు
అన్నంతపనీ చేస్తాడు చూడండి.
చస్తున్నవాళ్ళు చస్తూనే ఉంటారు.
పుడుతున్నవాళ్ళు పుడుతూనే ఉంటారు
ప్రపంచం పరిభ్రమిస్తూనే ఉంటుంది
అటు సూర్యుడి కిటురావడమే పని మరి.
అంతా బాగానే ఉంటుంది
అర్థనగ్నపతి చేతుల మార్పులో
కొత్తకొత్త రకాల రూపాలే
పొందుతుంది చిందుతుంది అందాలు.

# గ ద్గ ది క

భూమ్మీద భరతంమీద పీఠంమీద
ముత్తయిదువుల మునివేళ్ళుపూసిన
పసుపు పారాణుల గుమ్మాలమీద
పండుగ పందిళ్ళల్లో పచ్చనితోరణాలు
పరిపూర్ణత్వం పొందిన కలవొక్కటి
నాట్యం చేస్తున్నది
నలభైయేళ్ళ నాటిది.
మేళాలు తాళాలు, సన్నాయి నాదాలు
లలిత సంగీతాలు సహితం వినిపిస్తున్నవి.
అవధిలేని అంతంలేని కలాపాలలో
వ్యవధిలేని పరిధిలేని సంతోషాలు
అందరిసుఖాలూ తీర్చిదిద్దాయి
ఈజనకోలాహలం ఎందుకేమిటని
నా వెర్రి !
కాబట్టే నాగొంతు గద్గదిక
అమ్మా ! నాన్నా ! అన్నా !
తమ్ముడూ ! చెల్లాయీ ! మిత్రమా !
ప్రేయసీ ! సఖీ ! సతీ !
కాబట్టే నా గొంతు గద్గదిక.

అర్థమవుతుంది మీకు
నా గద్గదిక
ఇది వ్యర్థమైపోదు పన్నీటిబూడిద,
పెరట్లో నాటిన విత్తొకటి
అరచిటికలో చెట్టయినట్టు
చెట్టునిండా కాసులు కాసి
ఘుళ్ళుమని నేలను రాలినట్టు
రాలిన కాసులు దొరికినన్ని
రహస్యంగా మూటగట్టుకున్నట్టు
ఎంత ఆనందం ! ఎంత సంతోషం
ఎందుకు పెద్దలూ ఈ వెర్రి వాగుడు !
మూటల్లోనివి కాసులని పాపం !
ఉన్న రెండుకళ్ళూ మన్నెంత నమ్మిస్తాయో !
ఈ పేరుప్రతిష్టల కష్టార్జితాలని
ఉన్న ఒకగుండెకీ ఎంత పట్టుదల పాపం
వొద్దనుకున్నా కనిపించేవి
గతజల సేతుబంధనాలే,
కాలాన్ని అరిగించేసి కష్టపడ్డాం
ఏట్లో కలిపేద్దాం కాట్లకుక్కల రూపాలు
కలుద్దాం కలుషాలు తుడిచేసి
ఒకయుగం తపస్సు చేస్తేకద
ఒక్కక్షణం ఆనందానికి అర్హులం !
ఈజన్మ త్యాగంలోనే ఉంది
ఈనాల్గుకోట్ల బ్రహ్మానందం !

# నిత్య సత్యాలు

చీకటి వెలుగుల తేడాలు తెలీని
జీవులంతా లేస్తున్నారు లే
ఇటే వస్తున్నారు లే
కాయ కష్టా లన్నీ
సుఖ దుఃఖాలెన్నో
కాలానికి విడిచి పెట్టు కున్నారు
మేలు కొంటున్నారు - ఈనాడు
మేలు కొంటున్నారు
మేలు కోరి వస్తున్న సుభిక్షానికి
హారతి పడతారంతా
స్వాగత మిస్తారంతా.

ఆకలి దప్పులు వేస్తున్నప్పుడు
మబ్బులొచ్చి వర్షిస్తాయని
భూగర్భంలోంచి పైరులు తలెత్తి
పచ్చపచ్చగా నవ్వుతాయని
మంచి మంచి రోజులు గంటలు
ఎంతో దూరంలో లేవని

గుర్తిస్తున్నారు తమకు
వర్తించు కుంటున్నారు

మనిషి చేతిలో కత్తుల గుత్తి
ఝళిపించడమే స్వార్థ సంపత్తి
కంకరాల రాపిడితో చెమటకు
మండదు ధనరాశితాపం తుదకు
నిర్బంధపు సోమరితత్వం శత్రుత్వం
నిప్పులమయ్యే శ్రమలూ దమలూ
పీడితులైన వాళ్ళు బలికాబోయే
కాలానికిదే భరతం
పాడుకుంటారు
ఆడుకుంటారు
అర్ధాకలితో కిరకిరలూ
వ్యర్థఘోషలూ, ఆత్మహత్యలూ
అల్పాయుర్దాయాలూ
బాధలతో నిండిన కథలూ
నిన్నటి అరణ్యరోదనకా
మొన్నటి హిరణ్యవేదనకా
అన్నింటికీ ఇస్తున్నారు తిలోదకాలు
ఆనందం మా దంటున్నారు
ఆహ్లాదం మే మంటున్నారు
శాంతికి మాకే హక్కంటున్నారు

కాంతులు మాలోని వంటున్నారు
తరతరాలుగా హింసలలో పడి
ధారుణిలో నలిగిన విప్లవ
చైతన్యగాథ నవచరిత్రలో
సాధించిందితే అమరాధ్యాయం
శోధించిందితే సత్యం నిత్యం.

## ఒక గుక్క

మంచి నీళ్ళు మంచి నీళ్ళు
ఒక గుక్కెడు మంచినీళ్ళు

వాక్కుపోతున్నది నాలుక
అర్చుకుపోతున్నది గొంతుక
పట్టుతప్పుతున్నవి కీళ్ళు
పట్టుకుపోతున్నవి కాళ్ళు
మంచినీళ్ళు మంచినీళ్ళు
ఒక్కగుక్క మంచినీళ్ళు.

మేఘాలన్నీ వర్షిస్తున్నవి
చెరువులు బావులు నిండుతున్నవి
గుక్కెడునీళ్ళకు మాత్రం ప్రాణం
కొట్టుకుపోతున్నది నేస్తం.
మంచినీళ్ళు మంచినీళ్ళు
గుక్కెడుచాలు మంచినీళ్ళు.

అర్థిస్తున్నాను నోరుతెరిచి
వ్యర్థ పేలాపనేనాది అరిచి

అరిచి స్మృతితప్పితే బిందెడునీళ్ళు
పోస్తారు నెత్తిమీద మనవాళ్ళు
మంచినీళ్ళు మంచినీళ్ళు
ఒక గుక్కెడు మంచినీళ్ళు.

బతికుండగా మారు పలకని లోకం
చితిమీదచేస్తుంది నాట్యాలనేకం
గతుకుల్లోబడ్డ జీర్ణదేహం నాది
మెతుకైనాలేని పులిస్తరాకు సోది.

# క్ష ణం క్ష ణం

పరుగెడుతున్నై ఊహాలు
ఎక్కడికో మరి
ఎక్కడికో పరు
గెక్కడికో !
ప్రశ్నిస్తున్నై ఆశలు
జవాబులన్నీ
సమిష్టిగా పడె
సమాధిలో !
నిలపెడుతున్నై కోర్కెలు
నిలపడ లేనివి
కలవరపాటువి
కాలములో !
దడ దడ మన్నై గుండెలు
దాటిన గంటల
పాటున రెప్పల
పాటులలో !
మంటల పడినై అశువులు
మాటలు పెగలక
కోటలు పగలక
చీకటిలో.

# శాంతి!

ఎంతకాలం వెతికేది నీ కోసం ?
ఎక్కడున్నా సరే రా నా కోసం !

కాలంలేచి కళ్ళు తెరిచింది
అనుభవంలో భవిష్యత్తు చదివింది
సంకెళ్ళు సడలించి చేతులెత్తింది
ఎలుగెత్తి పరుగెత్తి పిలుచుకుంటోంది

ఏకాలంలో ఎప్పుడొచ్చి ఎన్నాళ్ళు
ఏ సుభిక్షాలు చూపించావో !
ఏ శోభలు నాటించావో
తర తరాలన్నీ దాటిపోయినై
యుగయుగాలు మళ్ళీ ఊగిపోయినై

రణరంగాల మారణ ఘోషలూ
జన సందోహ క్షామ పీడలూ
ఏకమై చెరపట్టి తరిమిన రాత్రంతా
నీ మానం కాపాడలేని వాళ్ళంతా
నీహింసచూస్తూ ఊరుకున్నారంతా

అంతా చెప్పుకుపోతారెన్నెన్నో కట్టుకథలు
చేస్తారంతా స్తోత్రాలు.
పఠిస్తారెన్నో పత్రాలు.
అంతర్జాతీయ మంతా
హారతివ్వ మంటుంది
అడుగు ముందుకు వెయ్యమంటే
అది నాపని కాదని బెదురుతుంది.

పరస్పర పీడకలల్లో నలిగిన
పసిపాపల పాలకేకలూ
భయానక నినాదాలలో రగిలిన
పరపీడిత సంక్షోభాలూ
రెచ్చకొట్టిస్తాయి గర్భశోకంలో
పచ్చగడ్డి భగ్గుమనిపించే లోకంలో.

రక్తంలో కత్తిముంచి
రాస్తామంటారు రాజీపత్రం
పరస్పర బద్ధవైరంలో ముడి
వేస్తామంటారు స్నేహసూత్రం
సత్యానికి నాడులు బిగించి, చేయ
మంటారు సదా దాస్యం.

గుదిబండగా మారిందిలే బతుకు
వ్యథలతో నిండిందిలే తుదకు

హారించి పోయిందిలే ప్రాణం
నశించి పోయిందిలే మానం.

మిగిలింది ఆశాకృతి తలపు
మెరిసింది చాలాకృతి మెరుపు
కలిగింది జీవచ్ఛవంలో నవశక్తి
పలికింది ఆశయంలో జనసూర్తి.

# ఓం తత్సత్

ప్రపంచశాంతి సంరక్షణకోసం
పదిమూల సూత్రాల పథకం వేశాం
సామదానభేద దండోపాయాలు
సరిచూసి వేలిముద్రలు వేశాయి

హక్కులూ ఆశయాలూ దండగుచ్చాం
వీధిపోయేవాడి మెళ్ళో పడేశాం
పీట ముడపడిందా ! పీక తెగుతోందా ?
విడుతుందిలే భయపడకు !
ముహూర్తం వస్తుందిలే, తొందరపడకు.

నువ్వెవరు ? నే నెవరు ?
అందరం సర్వం శ్రీ జగన్నాథం
భూగోళ గర్వం
అది మహాలక్ష్యం
సాధనే సాక్ష్యం,
ఇస్తానులే పదిరూపాయల నోటొక్కటి
నామాటవిని చెప్పింది చేయొక్కటి

భాష్యాలు లక్ష్యం చేయకు
మట్టికొట్టుకు పోతావు
వేషాలకు లోటేం నీకు ?
భరతనాట్యంకూడ చేస్తావు !

వస్తాయికద తమ్ముడూ !
ఎంతవాడికైనా పొట్లు
దీపమున్నప్పుడే చక్కపెట్టాలంది
మూలసూత్రాలలో మొదటనే ఉంది !

# యుగ ధర్మం

ధర్మాధర్మాల కొమ్ముల
పెనుగులాటల పాటుపోటులో

మానవుడా ! రక్తసంబంధీకుడా !
ఎక్కడుందని వెతుకుతావు
మర్మం ధర్మం న్యాయం సత్యం ?
ఎక్కడికని పరుగెత్తుతావు
ఇది కీకారణ్యం
నవయుగారణ్యం

అవునవును నీ ఘర్మఘోష
వినిపిస్తున్నదిలే
జలపాతభాషలో
అదిగదిగో నీ గుండెమంట
కనిపిస్తున్నదిలే
నిశీధి నిరాశలో

అవతరించిందిలే
సరికొత్తధర్మం
శ్లేషిస్తున్నదిలే
యుగధర్మ ధర్మం

ఆకలిదప్పుల తో పోరి
కేకలు పెడితే నీ
శరీరనగ్నం పరిస్తుందిలే
నవయుగ ధర్మం
మాటపెరిగితే నాలుకాడితే
సిద్ధిస్తుందిలే దారుణమైనది
మారణహోమం
సూటిగా అడుగువేసి
నడిస్తే పోటు
పొడుస్తుందిలే నీస్వాతంత్ర్యం
సమానమానవుల మధ్యలో
నశింపచేస్తుందిలే
మానవత్వం న్యాయం !
ఇది యుగధర్మం
ఇదే ఇదేలే యుగధర్మం
నవయుగ మర్మం
నీ ధర్మం నాదర్మం చేరి
తలదాఘుకున్నదిలే
భూగర్భమధ్యంలో

అధర్మం పేరుమారిందిలే
అన్యాయమూ, అసత్యమూ
అసహనమూ, అధర్మమూ
అతి దీర్ఘకాలపు రాజీపత్రాలు

రాసుకున్నవితే, స్నేహాలు
చేసుకున్నవితే, సమైక్యచిహ్నాలు
వేసుకున్నవితే దేహాల, పేర్లు
మార్చుకున్నవితే లోకాల-
నీ పేరూ, నా పేరూ
అందరి పేర్లూ కలగలిపి
మార్చిందితే యుగధర్మం ! హంత
మార్చిందితే సవధర్మం
దేశద్రోహులమని వెంట
తరిమిందితే
దేశభక్తుడి హంతకత్వం
కీర్తించిందితే
స్వార్థం
స్తోత్రించిందితే

పరుగెత్తకు మానవమాత్రుడా !
తప్పించుకోలేవు.
క్షతగాత్రుడా !

## అ న్న త్

ఒకనాటి కొకనాడు
ఎగనామిడే నీకు
ఎగనామిడే !
ఒకనాటి కథకాదు
ఒకమనిషి ధరకాదు
శతమానభవతి భి
క్షాం దేహిలే కాదు

చేసేదిలేక దీ
క్షలను పట్టేస్తాము
తోచేదిలేక మో
క్షములు కల్పిస్తాము
దీక్షలకు శ్రీరామ
రక్షలిచ్చేస్తాము
మోక్షమే లక్ష్యమని
లక్ష పలికేస్తాము
కక్షలొద్దంటాము
పక్ష మొకటుంటాము
ఏటేట మాకెన్నొ

యానాది పండుగలు
మాటాడితే మాకు
మరిడమ్మ పండుగే !
పండుగొస్తె చాలు
పరవశులమవుతాము
పరలోక యాత్రికుల
పని మరచి పోతాము

నా తిండి నా బట్ట
నా యిల్లు నాడబ్బు
నా భాష నా కులం
నాగర్వ గుడిలోన
నా క్షేమమే నాకు
నా బాగె నా దన్ను
మాదెన్న వా దులం
నలుగురం మేము మా
పొట్లేవొ పడతాము
కాట్లకుక్కల్లాగ
కొట్లాడు కుంటాము
ఒకరి కొకరం కుమ్ము
కుంటాము చస్తాము
అన్నిటికీ మాది
అస్మదీయ దృష్టి

కథలకింకా మాకు
కరువు రానేలేదు
తిండి కరువుల కెపుడో
మొండి కెత్తేశాము
మాబోటి గాళ్ళుంటె
మాగొప్ప తింకేల ?

చెప్పటానికి మాది
ఒకనాటి కథకాదు
ఒక మనిషి ధరకాదు !

# సంకల్పిక

ఎవరక్కడ, ఎన్నాళ్ళయి
ఎదురుచూస్తున్నారు మీరు ?
ఎవరో ఒకరైవుంటారు
శూన్యంలో ఆకారాలు
కోటి గొంతుల కోలాహలంలో
కోటిసదుల ప్రవాహంలో
చల్లని పవనంలో, కవనంలో
ఆశయాల సార్థకత్వంకోసం
ఆలకిస్తుంది గీతం విశ్వం
సాధించాలొక మహాకర్తవ్యం
సామాన్యుడి కోరికలో ఒకవీసం
సంకల్పాలకు ప్రాణం పోయాలి
అందాల ఆనందాలందివ్వాలి
శతాబ్దం ఇంకా కోరుతున్నది
ఇక్కడే ఇప్పుడే గతస్వప్నంలో లిప్త
చక్కటి రూపంలో రెక్కలు విప్పుతున్నది
స్వేచ్ఛగా ఎగిరి జగత్తంతా ఆవరిస్తుంది
అణువులో ఆదిశక్తి ప్రభవించి

శివ

తాండవిస్తుంది పలికిస్తుంది కళ్యాణం
అవనిలో జీవశక్తి కదిలించి
పుష్పిస్తుంది ఆనందాల తోరణం
నిత్యవచ్ఛందనాలు నిండారించి
సత్యవాక్కు పాలిస్తుంది జనగణం.

# ర ణ గొ ణ ధ్వ ని

తలల్లేని శరీరాలు కనపడి
అలల్లేని కెరటాల ఘోష వినపడి
అర్ధరాత్రి నడినెత్తిన సూర్యం
పట్టపగలు చిట్టచీకటి శూన్యం
పొడగట్టిన చెరపట్టిన స్వప్నంలో
నాతల వేరై నాతో
మాటాడిన మూటలలో
నాకొక ఆశాకిరణం
నాలువలే శాభరణం.

నీటిబొట్టో, మెతుకో, నీడో,
సిగ్గు ధరించే చింకిపేలికో,
జోలలుకరిగే లాలిపాటలో
ఇంద్రియవైకల్య వికారపు చేష్టల
శాంతికి చల్లటి హస్తస్పర్శో
ఉత్తేజానికి ఉల్లాసానికి
కత్తిలాంటి సరికొత్త నడకలకి
ఊరుమై, మెరుమై విరుచుకుపడి
ఆదరించి జలదరించి ఆకాశంలో

ఎదమరచి, మదిచరచి, భౌతికం
పరిచి, అంగాలుచాచి, అనంత
శూన్యపథం నేనై, అంతా
ఆవరించి, ఆవులించి, మత్తువిడిచి
చెరవిడిచి, కరమిచ్చి వాంఛలు
వెదజల్లి వాదిలించి సొదలన్ని
అందని అర్థాలకు వ్యధలిచ్చి
పొందిన ఆవేశాలకు కథలొచ్చి
జనాళి పదాలి ధూళిదూసర
వీచికల రేణుకల శతకోటి
శతకోటి అణుకణాల
నాభిశక్తి పగిలించి ప్రభవించి
పిదప పీడిత పీడల జోడించి
కూడించి, గుండెలుపిండి ఎండించి
మండించి, నవరూపమున కంకెలు
పండించి, భూనభా లేక భాండం
నిండించి, వెన్నువిరిచి ప్రాణానికి
కన్నులిచ్చి అందాలు చందాలు ప్రత్యక్షించి
నక్షత్రాంక్షితలు సాక్షించి
ఈక్షణిక వీక్షణాలో లక్ష్యించి
చల్లార్చు వెలార్చి రుధిరజ్వాలలు
ఆల్లారు ముద్దుల బంగరు పాపలు.

# అంతర్నాటిక

ప్రస్తావన -

చుక్కాని విరిగిన పడవలాగ
సాగిపోతున్నది మహాప్రళయంలో
జనావళి జైత్రయాత్ర
ఇదొక అనంత చరిత్ర
చివరెక్కడో మొదలక్కడే అన్నది
చిన్నారిసత్యం మరుగు పడింది.
చూసింది చూసినట్టూ
చెప్పింది చెప్పినట్టూ
విన్నది విన్నట్టూ
కన్నట్టయితే
ఇనాళ్ళూ పడే బాధలు
ఎన్నో మేళ్ళయి నడుస్తున్న వ్యధలు
ఎక్కడికైనా పోవచ్చు
ఏట్లో కలియొచ్చు.
ఎందుకయ్యా ఈ శ్రీరంగనీతులు
ఏముంటుంది ప్రయోజనం ?
మంచినీళ్లు తీర్చలేని దాహం

59.

మంచిమాట తీరుస్తుందొకప్పుడు
కడుపులుకాలే జీవితాల నిఘంటువులో
కనిపించవు నీతిలేనిమాట లెప్పుడు
నలుగురి కంఠాలొకటై పలికే
నాలుగుమాటల విలవొక నీతి
రాతలకూ కూతలకూ
చేతలకూ పోతలకూ
తలకూ తలకూ తలకూ
ఎక్కడలేవు వ్యత్యాసాలు ?
ఎక్కడోలేవు సత్యాలు
వెతక నవసరం లేదు
వెళ్ళనవసరం లేదు
కోటికబుర్లు చెప్పి నోటిని నొప్పించాలా ?
సూటిగా ఒక్కమాటలో
సూక్తిస్తుంది సత్యం శక్తి.
నీటిబుడగల బృందగీతి
క్షణం పాటు మెరిసే అందం
కనిపించేదే ఒక్క యదార్థం
ఇప్పుడే మునిగిపోయినా డొక్కడు
ఎప్పటికీ మృత్యువు చిక్కక
ప్రశాంతమయిన ప్రపంచానికి
పరికించ మన్నాడొక సందేశం
పంపించాడు ఊపిరితిత్తుల్లోంచి

పొడుకోమన్నాడు ఆత్మహత్యల్ని
కడుపునిండని కలవరింత లిచ్చి
బుడగలై అవతరించమన్నాడు
మనిషి !

రాబందు -

చచ్చినవాడు ఎలాగూ చచ్చాడు
బయటేచస్తే నాఆకలి తీరేది !
చచ్చేముందే రావాలా స్వార్థం
చచ్చిన వాళ్ళని నమ్మటమే వ్యర్థం !

ఎండుటాకు -

పచ్చ పచ్చగా పుట్టించి గాలిచ్చి
నడిచే వాళ్ళకు నీడలు కలిగించి
నానారకాలు ఊరించి ఆశలు పెట్టి
సరసాలతో సరదాలతో
పరదాలలో కాలం క్షేపంచేసి
చివరకి
మండుటెండల కొదిలి
చెండాడి సకిలించి
ఎండగొట్టింది మఱ్ఱిచెట్టు
ఏపిట్ట నోటనో పడి గూటిని
కప్పటమే చివరకు మిగిలిన భాగ్యం
ఇప్పటికీ బతుకే నా కానందం.

## అ భ య ము ద్ర

అంధకార సందిగ్ధకాల హ్రాద -
యాంతరాళ కల్లోల క్లేశినీ !
శిథిలమానసిక వ్యథా ధారుణీ !
ఛిన్న భిన్న సుప్తి స్వరూపిణీ !
భయపడకమ్మా !
భయపడకు !

చల్లని వెన్నెలకాంతి ధరించి స-
ముల్లాసినివై వచ్చె నుషస్విని
అంతరమ్మున జ్వలించు మంట చ -
ల్లార్చి నొసట కుంకుమరేఖల నిడు
భయపడకమ్మా !
భయపడకు !

కాలమాన పర్యాలోకన సం
ఘానిష్కృతి విస్మృతి పథమ్మునకు
తిలాంజలిడి జయఘంటానాద
స్వరమ్ముతో స్వాగతమ్ము పట్టెను
భయపడకమ్మా !
భయపడకు !

వాగులు నదులై ప్రవహించిన ప్రా-
పంచిక హాహాకారమ్ములు తొల-
గించి అభయముద్రా గీతికలం-
దమృత బిందువులు చిలికిరి అమరులు
భయపడకమ్మా !
భయపడకు !

# "అ వు ని ది నా వి ధి"

అక్కడికొక కథ ముగిసిన రోజున
కొత్త కథకు పుట్టినదీ కదలిక....
నిన్నటిరాత్రి కారునల్లని మేఘాల
మిన్నంటు మంటలైన తాపకోపాలు
చల్లారె వాటంతటవి
తెల్లారె దానంతటది
ఎర్రటి గోడలమీద, కోటలమీద,
ఎగురు జెండామీద, బురుజులమీద,
వెలుగొచ్చి మెరుపిచ్చి అభయమిచ్చింది.
ఈకథకు నాంది పుష్కరం.
పుటలకు ముందు, నాప్రజల ముందు
ఒక చక్కని నాటకమై, నటి కంఠానికి
సూత్రమై, వర్థిల్లు వెయ్యేళ్ళున్నది.
ఈకథకుని బతుకొక్క తిరస్కృతికి
ఆహుతి అయినప్పటి తృటిలో
కోట బురుజులో కనువిప్పుకి తనువిచ్చి
అవునిది నావిధి అన్నానప్పుడు.
నావిద్య విద్యుత్ ప్రవాహమై
మస్తిష్కాన్ని జ్వలియించింది.

ఆకలి కేమిస్తుందది పాపం,
ఈ కలికాక పెట్టని శాపం!
నేనన్నా, నా ప్రజలన్నా,
ఏదన్నా, మంచికి సున్నా
అని వొక్కడు, నాలో వొక్కడు
భరించాడు సహించాడు శత్రు
త్వం, పాలయి ఊగ్గయి పెరిగిన
అసురత్వపు ఛాయలలో తన
కోరికలకు కొరతలేని నరుడు.
కోటిమంది శ్రేయస్సుకోసం
ఆకలికంటిన పొట్టను ముడిచి మడచి
వంగిన నడుము నిలదీసి కట్టి
మర ఫిరంగించి దుమికి ఊరికి
తిరిగొచ్చి కలయచూసి అంతా
పుష్పాలు వర్షించినట్టు కనిపిస్తే
అవునది నా విధి అన్నానప్పుడు.
ఎవరెవరో ఆనందిస్తున్నారు, కల్పించు
కుంటున్నారు కోటి కోటి సుఖాలు
ఎవరెవరో, మరొక మరొక నరులకేమి,
సకలాలు, ఐశ్వర్యాలు పోగుచేస్తున్నారు.
ఎవరెవరో పాడుకుంటున్నారు, ఆడుకుంటున్నారు
ఎవరెవరో మాడుతున్నారు, అడుక్కుంటున్నారు
అరుగులమీద, చెట్లకింద, రాళ్ళపైన

పడుకుంటున్నారు, అలో మంటున్నారు.
అర్ధరాత్రివేళ ఆశ్రయంలేక, భారం
మోయలేక, కాలవలో పడి శ్రమించి
కన్నదొక్క చంటివాణ్ణి చిన్నతల్లి
పట్టపగలు గుండెమంట కాగలేక
మానవత్వాన్ని, తత్వాన్ని మరుగుపరిచి
చేశాడొక చేయరానిపని తనకై
తన ప్రాణాలకు లొంగిన బంటొక్కడు,
ఎవరెవరైతే నాకేం
ఎవరేమైతేనేం నాకు.
ఈపుణ్యభూమిలో అందరికీ కావలసింది
క్షేమంలో కొంతయితే కామంలో మరికొంత
క్షామం తమకు లేకుంటే, ఇతరులకుంటే, చింతలేదు
అన్నీ చూస్తాను అనుభవిస్తాను
అయినా అంటాను, అంటున్నానిది
అవునది నా విధి
అవునిది నావిధి.